





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

# ఉడతమ్మ ఉపదేశం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120033015

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఉడతమ్మ ఉపదేశం

పిల్లల కథలు

రావూరి భరద్వాజ



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976లో ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషిచేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవిరెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదాఅశోకవర్ధన్
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి.

# ఇందులో

# 1. ఉడతమ్మ ఉపదేశం

గోదావరీ నదీతీరాన ఒకప్పుడు చిక్కని అడవులు ఉండేవి. ఆ అరణ్యాల నిండా రకరకాల జంతువులు ఉండేవి. ఆ జంతువులను చూడడానికీ, అడవిలోని చెట్లను చూడడానికీ, దూరప్రాంతాల నుండి కూడా చాలామంది వస్తూ పోతూ ఉండేవారు. ఆ వచ్చిన వారు, తమవెంట రక రకాల కాయలనూ, పళ్ళనూ, మిఠాయిలనూ తెచ్చుకొనేవారు. తిన్నంత తిని, మిగిలిన వాటిని, దూరంగా విసిరేస్తూ ఉండేవారు.

ఒకసారి – ఈ అడవిని చూడడానికి ఒక కుటుంబం వచ్చింది. వస్తూవస్తూ వాళ్ళు రకరకాల ఫలహారాలు తెచ్చుకొన్నారు. మధ్యాహ్నం దాకా అడవిలో తిరిగారు. చూడవలసిన వన్నీ చూశారు. అలసిపోయి ఓ చెట్టుకింద కొచ్చారు. వచ్చాక – తాము తెచ్చుకొన్న మూటలు,



పొట్లాలు విప్పుకొని కడుపు నిండా తిన్నారు. తినగా మిగిలిన వాటిని చెట్టు కిందే పారబోశారు. కాసేపు విశ్రాంతి తీసుకొన్నాక వెళ్ళిపోయారు.

ఇదంతా ఆ చెట్టు తొర్రలో ఉన్న ఉడత పిల్లాడు చూస్తూనే ఉన్నాడు. ఎక్కడి వాళ్ళక్కడకు వెళ్ళిపోయాక, ఆ ఉడతబ్బాయి కిందికి దిగివచ్చాడు. చెల్లాచెదురుగా చెట్టు కింద పడిఉన్న మిఠాయి ముక్కల్ని ముందు —కొంచెంగా రుచి చూశాడు. అవి తియ్యగానూ, రుచిగానూ ఉన్నాయి. తాను తినగలిగినన్ని తిని —మిగిలిన వాటిని అమ్మకోసం అట్టే పెట్టాడు.

సాయంకాలం అయ్యేసరికి, ఆపసోపాలు పడుతూ అమ్మ ఉడుత వచ్చింది. రాగానే – ఓ ఆకులో కాసిని మిఠాయి తునకలుంచి అమ్మ ముందు ఉంచాడు ఉడతబ్బాయి.

కొడుకు వేపు ఆశ్చర్యంగా చూసింది ఉడతమ్మ.

జరిగిన సంగతంతా తల్లికి చెప్పాడు ఉడతబ్బాయి. చెప్పి చెప్పి చివరికిలా అన్నాడు–

"అమ్మా ! నువ్వు ఇంతకాలమూ, ఈ అడివిలో దొరికే పిందెల్ని, కాయల్ని మాత్రమే నాకు పెడుతున్నావు. నేనూ తింటున్నాను. ఈ ప్రపంచంలో మనం తినగలిగినవి ఇవేనేమో, ఇలాంటి వాటినే మనం తినాలేమో అనుకొన్నాను. నువ్వయినా – నాకెప్పుడూ ఈ మిఠాయిలు సంగతి చెప్పనన్నా చెప్పలేదు. ఎందుకని?" అన్నాడు ఉడతబ్బాయి.

ఉడతమ్మ సన్నగా నిట్టూర్చింది.

"నాన్నా! ఇలాంటివి నాకూ తెలుసు. కావాలనే, వీటిని గురించి నీకు చెప్పలేదు. సుఖాలకు అలవాటు పడడం తేలిక. ఆ అలవాటు నుండి బయట పడడం కష్టం. ముందుగా – కష్టాలంటే ఏమిటో తెలియాలి. అవి బాగా అనుభవించాలి. ఆ తరువాత సుఖాలు రావాలి."

"కొంతకాలం సుఖపడిన తరువాత, దురదృష్టవశాత్తూ కష్టాలు

వచ్చాయనుకో – అప్పుడు, ఆ కష్టాలను అనుభవించడానికి పెద్దగా ఇబ్బందులు పడనవసరం ఉండదు. అందుకే – నీకే మిఠాయిలను గురించీ అవి తినడంలో ఉండే సుఖాలను గురించీ చెప్పలేదు నాన్నా ! అంతేగానీ, నీమీద కోపంతో కాదు."అన్నది ఉడతమ్మ.

"ఈ మిఠాయిలూ అవీ దొరకడం చాలా కష్టమా?" అన్నాడు ఉడతబ్బాయి దూరంలోకి చూస్తూ, ఏదో ఆలోచిస్తూ.

"ఒకరకంగా కష్టం! ఇంకో రకంగా కష్టంకాదు. అయినా –నాకు తెలీక అడుగుతున్నాను ; ఈ గొడవలన్నీ నీకెందుకురా నాన్నా?" అన్నది ఉడతమ్మ.

"ఎప్పుడో ఒకప్పుడు తప్ప కుండా తెలుసుకొనవలసినవి, ఇప్పుడే తెలుసుకోవడంలో,దోషమేమీ లేదు గదా! అందుకవి – అన్నీ అడుగుతున్నాను."

నేనో విషయం స్పష్టంగా చెబుతున్నాను వినమ్మా! నేను ఇకముందునుంచి, ఈ పచ్చికాయలూ, పిచ్చికాయలూ తినను. నాకు ఖరీదైన భోజనమే కావాలి. అవి – నువ్వేలా తెస్తావోకూడా నాకు అవసరం లేదు. అవి నీవు తెచ్చిపెడుతున్నంతకాలం నీతో ఉంటాను. మానేసిన రోజున, చెప్పాపెట్టాకుండా ఎటో పోతాను. అప్పుడు నాకోసం నువ్వు ఏడ్చినా మొత్తుకొన్నా లాభంలేదు. తరువాత నీ ఇష్టం!" అన్నాడు ఉడతబ్బాయి. ఉడతమ్మ గుండెలు గుభేలుమన్నాయి.

"నిన్న సాయంకాలం దాకా కుర్రాడు బాగానే ఉన్నాడు. ఈ రోజు ఉదయం తను బయటికెడుతున్నప్పుడు కూడా బాగానే ఉన్నాడు. ఇంత తిండి మూటగట్టుకొని ఇంటికి వచ్చేసరికి కుర్రాడిలా తయ్యారయ్యాడేమిటి?"

ఉడతమ్మ కొడుకుని కావలించుకొంది.

బంగారు కన్నయ్యలాంటి తనకొడుకు ఇలా బండబారి పోవడానికిగల కారణాలేమిటో ఉడతమ్మ సరిగ్గానే ఊహించింది!

"బుజ్జినాన్నా ! నువ్వెప్పుడూ ఏదీ నన్ను అడగలేదు. ఇంత కాలానికిగాను, నువ్వు నన్ను అడిగిందల్లా మిఠాయిలు మాత్రమే! ఇలా నువ్వు అడగడం కూడా సహజమేరా! పిచ్చితండ్రీ!

"చిన్నతనంలో, అవీ ఇవీ తినాలని అందరికీ అనిపిస్తుంది. నాచిన్నప్పుడు, నే అమ్మనూ నాన్ననూ, ఏవేవో కావాలని నేనూ అడిగాను. కాకపోతే ఓ చిన్న సంగతి మాత్రం నువ్వు గుర్తుంచుకో!" అన్నది ఉడతమ్మ.

"ఏమిటది?" అన్నాడు ఉడతబ్బాయి.

"రేపు – నాకూ చిన్నతనం రావచ్చు – నాక్కూడా, అవీ ఇవీ తినాలని అనిపించవచ్చు. అప్పుడు నేనూ నిన్ను అడుగుతాను. అలా అడిగినపుడు, నువ్వు ముఖం చిట్లించుకోకుండా, విసుక్కోకుండా తెచ్చిపెడితే నాకు అంతేచాలు" అన్నది ఉడతమ్మ.

ఉడతబ్బాయి ఆశ్చర్యపోయి, అమ్మవేపు చూశాడు.

"అదేమిటే? మళ్ళీ నీకు చిన్నతనం రావడమేమిటే?" అన్నాడు ముఖం చిట్లిస్తూ.

"ఎల్లకాలం ఎను ఇలాగే ఉండను గదా! ఎప్పటికో అప్పటికి ముసలితనం ముంచుకొస్తుంది గదా! అప్పుడు నేనూ— నీకు మల్లేనే ఎక్కడికీ కదలేనుగదా! ఏమీ సొంతంగా తెచ్చుకోలేనుగదా! ఆ రెండో చిన్నతనంలో, నాకూ అవీ ఇవీ తినాలనిపించినపుడు— నువ్వీ విషయాలన్నీ గుర్తుంచుకొని, విసుక్కోకుండా తెచ్చిపెట్టు. నాకంతకన్నా

ఇంకేమీ అవసరం లేదు" అన్నది ఉడతమ్మ.

"అమ్మా! నువ్వు నన్ను చూసినంత బాగా నేనూ నిన్ను చూడాలని, ఇన్నిసార్లెందుకు చెబుతున్నట్టు? ఇప్పుడలా జరగడంలేదా?" అన్నాడు ఉడతబ్బాయి.

"మొన్నమొన్నటి దాకా అలానే జరుగుతూ ఉందినాన్నా! ఈ మధ్యనే మనవాళ్ళు మనుషుల్ని చూసి చెడిపోవడం ప్రారంభించారు. అందుకే ఇంతగా చెప్పవలసివస్తూన్నది" అన్నది ఉడతమ్మ కొడుకు వేపు జాగ్రత్తగా చూస్తూ.

ఉడతబ్బాయి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

"అమ్మా! నాకేమీ వద్దు. నా కోసం నువ్వు కష్టపడను కూడా వద్దు. నువ్వు తప్ప- ఇంకేమీ నాకు వ ద్దు." అన్నాడు ఉడతబ్బాయి. వాళ్ళమ్మ కాళ్ళకు చుట్టుకుపోతూ.

# కనువిప్పు

చాలా సంవత్సరాల కిందటి సంగతి ! ఆ రోజుల్లో అమరావతీ నగరం చుట్టూ చిట్టడవులు ఉండేవి. ఆ అడవుల్లో చెల్లా చెదురుగా చిన్నా పెద్దా గ్రామాలు ఉండేవి. ఆ గ్రామాలలోని వారందరకూ పొలాలు ఉండేవి కావు. ఉన్నవారు వ్యవసాయం చేసుకొనేవారు. లేనివారు ఆ ఉన్నవారి దగ్గర కూలిపని చేసుకొని బతుకుతుండే వారు.

అమరావతికి రెండుకోసుల దూరంలోనే శంకరపాలెం అన్న చిన్న పల్లెటూరు ఉంది. ఆ ఊళ్ళో శంకరయ్యగారు ఉన్నారు. ఈ శంకరయ్యగారు మంచివారు మంచి మాటకారి. ఆ చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళు తరచుగా శంకరయ్య దగ్గరకొచ్చి, తమకున్న అనుమానాలను రహితం చేసుకొని పోతూ ఉండేవారు.



"పరమేశ్వరుడు గొప్పవాడు. అందర్నీ సంపన్నులుగా పుట్టించడం ఆయనకు చేత రాకకాదు. అందరూ ఒకే మాదిరిగా ఉంటే కష్టాలు, సుఖాలు ఎలా తెలుస్తాయి? అన్నంతింటే ఆకలి తీరుతుందనీ, ఆకలి తీరితే హాయిగా ఉంటుందనీ మీకెప్పుడు తెలుస్తుంది? బాగా ఆకలయినప్పుడు తెలుస్తుంది. అలాగే డబ్బులు ఉండటం లోని ఆనందం మీకు తెలియాలంటే, డబ్బులేక పోవడమంటే ఏమిటో తెలియాలి. అలా తెలియచెప్పడం కోసమే, ఈశ్వరుడు ఇలా చేశాడు." అంటారు శంకరయ్యగారు.

ఆయన ఉంటున్నంతసేపూ ఎవ్వరూ కిక్కురు మనరు. ఆయన మాటల తికమకలో – ఒక్కోసారి అర్థాలు కూడా మారిపోతాయి. చాలా సందర్భాల్లో ఆయనగారన్న వాటికి, ఎక్కడా పొంతన కుదరదు.

"వెలుతురు విలువ తెలియడం కోసమే చీకటి. చీకటి విలువ తెలియడం కోసమే వెలుతురు" అని శంకరయ్యగారు అన్నారనుకోండి.

"మరి ఈ రెండింటి విలువా తెలియాలంటే ఎలా?" అని ఎవ్వరూ ఆయన్ని అడగరు.

ఎందుకని?

శంకరయ్యగారికి కొన్ని క్షుద్రవిద్యలు తెలుసు. కొన్ని రకాల దయ్యాలు, పిశాచాలు, భూతాలు – ఆయన పిలిచినప్పుడు పలుకుతాయిట. ఆయన చెయ్యమన్న పనల్లా చేస్తాయిట.

అంచేత –

శంకరయ్యగారంటే భయమూ ఉంది. భక్తీ ఉంది. ఆయనగారన్న దాని కల్లా తల ఊపడమన్నా చేయాలి, తలకాయ వంచుకోవడమన్నా

చేయాలి.

సాధారణంగా ఆయన మాటకెవరూ ఎదురు చెప్పరు. అప్పుడెప్పుడో చాలా సంవత్సరాల కిందట – ఓ పొగరు మోతు వెధవ శంకరయ్యగారన్న దాన్ని విమర్శించాడుట. అప్పటినుంచీ ఆ కుటుంబానికి అనర్థాలు చుట్టుకొన్నాయి. వాడి పంటలు పురుగు పడి నాశనమయి పోయాయి. వాడికొంప నిప్పుపడి కాలిపోయింది. వాడి పడవకు చిల్లు పడి మునిగిపోయింది. పాము కరచి వాడూ చనిపోయాడు.

శంకరయ్యను కాదని, ఇన్ని కష్టాలను కొని తెచ్చు కోవడానికి ఎవ్వరూ సిద్ధంగా లేరు. ఇందువల్ల శంకరయ్యలో కొన్ని చిత్రమయిన లక్షణాలు చోటు చేసుకొన్నాయి.

తాను చెప్పిందే నిజమన్న గుడ్డి నమ్మకం ఆయనలో ఏర్పడింది. నిజం తప్ప మరొకటి తన మనసులోకి రాదన్న విశ్వాసమూ ఆయనకు కలిగింది. ఆయన్ను నమ్ముకొని బతుకుతున్న కొంతమంది – కాస్తంతను గంపంత చేయడమూ, చిలువలూపలవలూ చేర్చి చెప్పడమూ ప్రారంభించడంతో శంకరయ్య వాక్శుద్ధి కలిగినవాడి కింద ప్రచార మయ్యాడు. ఆయనలో చాలామందికి వింతలూ, విడ్డూరాలూ కనిపించడం ప్రారంభించాయి. ఇందువల్ల ఆయన గారు ఏదంటే అదే ఖాయం. అది గోడ అని వారంటే గోడ గానూ, 'అది నీడ' అని వారంటే నీడగానూ జనం చూడడం ప్రారంభించారు.

శంకరయ్యగారు భక్తులు కూడా.

ఆయనగారు భోజనం చేయని రోజులయితే ఉన్నాయి గానీ, గుడికి వెళ్ళని రోజు మాత్రం లేనేలేదు.

దేవాలయానికి వెళ్ళేప్పుడు గానీ, తిరిగి వచ్చేటప్పుడుగానీ,

ఆయన వెంట ఎవరూ ఉండరు. ఉండడానికీ వీల్లేదు.

"శంకరయ్యగారూ, భగవంతుడు గారూ లోక వ్యవహారాలను గురించి మాట్లాడుకొంటూ ఉంటారు. వాటిని ఎవరు బడితే వారు వినడం ఎవరికీ మంచిది కాదు" అంటారు శంకరయ్య అనుయాయులు.

శంకరయ్య గారు సాధారణంగా తలవంచుకొని నడుస్తుంటారు.

ఇవ్వాళమాత్రం – ఎందుకనో మరి – అలా తలెత్తారు. తలెత్తి పక్కగా చూశారు. ఆయన చూసినవేపుగా ముళ్ళపొదలు కనిపించాయి. ఆ పొదల వెనగ్గా, ఓ గన్నేరు చెట్టు కనిపించింది. ఆ చెట్టుకున్న ఒకే ఒక పూవుకూడా శంకరయ్యగారికి కనిపించింది.

ఆయనగారు – మరో అడుగుముందుకు వేశారు. ఆ గన్నేరుపూవు, ఆ ముళ్ళ పొదల వెనగ్గా భయం భయంగా బతుకుతున్నట్టూ, తనకు సాయంచేసే వారికోసం చూస్తూన్నట్టూ వారికి అనిపించింది.

అలా అనిపించాక – ముందుకు వేసిన అడుగును మళ్ళీ వెనక్కు తీసుకొన్నారు. ఆ ముళ్ళ పొదలదాకా వచ్చారు. ఓ చెట్టు కొమ్మను విరిచారు. ఆ కొమ్మ సహాయంతో, ముళ్ళపొదలను అటూ ఇటూ ఇటూ అటూ సర్దుబాటు చేశారు. అతి ప్రయత్నంమీద, ఆ గన్నేరు చెట్టుదాకా వెళ్ళారు. చిటారు కొమ్మకున్న ఆ గన్నేరు పువ్వును తొడిమెతో సహా తుంచారు. మళ్ళీ మెల్లగా వెనక్కు వచ్చాడు. వచ్చి – గుడి వేపుగా ప్రయాణమయ్యారు.

"ఒక్క నిమిషం ఆగుతారా, మీకు పుణ్యం ఉంటుంది!" అని వినిపించింది శంకరయ్యకు.

ఆయన ఆశ్చర్యపోయి, చుట్టూరా చూశారు.

"నేనే బాబుగారూ మాట్లాడుతున్నది, గన్నేరు పువ్వును.

చాలాకాలంగా నేనెవరికంటా పడకుండా, జాగ్రత్తగా కాపాడాయి ఈ ముళ్ళపొదలు. వాటికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి.

తనకున్నదంతా నాకోసం ధారపోసి, నన్నింతదాన్ని చేసింది, నాచెట్టుతల్లి! ఆ రుణం ఎలాగూ తీరదు. ఒక్కసారి, ఇక్కణ్ణించి వెళ్ళాక మళ్ళా ఇటుకేసి రావడమంటూ జరగదు గదా! అంచేతా – ఆఖరుసారిగా – నావారందరినీ చూసుకోనీండి. వారికి కృతజ్ఞతలు చెప్పుకోనీండి. వారికి వీడ్కోలు చెప్పనీండి!" అన్నది గన్నేరుపూవు బొంగురుపోయినగొంతుతో.

సెలవడుగుతున్నట్టూ, చేతులూపుతున్నట్టూ, దాని రెక్కలు కదలసాగాయి.

ఓ నిమిషం తరువాత శంకరయ్యను బయలు దేరమన్నది గన్నేరుపూవు.

"నీ ధోరణి కొంచెం మార్చు కోవాలి" అని సలహా ఇచ్చారు శంకరయ్యగారు.

"చెప్పండి. " అన్నది గన్నేరు పూవు.

"నిన్ను కన్నందుకు చెట్టుతల్లికి కృతజ్ఞతలు చెప్పావు. ఇంకెవరికంటా పడకుండా నిన్ను కాపాడినందుకు, ముళ్ళపొదలకూ కృతజ్ఞతలు చెప్పావు. ఇవి రెండూ మంచి పనులే – నేను కాదనను."

"కానీ – నువ్వో ముఖ్యమైన విషయాన్నే మరిచిపోయావు. నేనే గనక నిన్ను చూడకపోతే, నువ్వేమయి ఉండేదానివి? ఆ ముళ్ళ కంపలమధ్యనే, చూసే దిక్కు లేకుండా పడి ఉండేదానివి. నీ జన్మకు సార్థకత లేకుండా పోయేది. అవును గదా! అలాంటి నిన్ను – నేను చూశాను. నానా అవస్థా పడి, ఆ చెట్టు నించి వేరు చేశాను. నిన్ను

దేవునికి అర్పించబోతున్నాను. నీకీపాటి అదృష్టం సిద్ధించటానికి, నేనే కారణం! మరి – నాకు కృతజ్ఞతలు చెప్పాలన్న ఆలోచనకూడా నీకు రాలేదేం? " అన్నారు శంకరయ్య.

అతను చెప్పడం పూర్తిచేయగానే, పకాలుమని నవ్వింది గన్నేరు పూవు.

"మిమ్మల్ని చూస్తుంటే, నాకెంత జాలిగా ఉందో ఎలా చెప్పను శంకరయ్యగారూ! మిగిలిన వారందరి కన్నా మీరు – అంతో ఇంతో మంచివారు. ఆ మంచితనం గురించి, మీరు అతిగా ఊహించుకొన్నారు. ఆ ఊహాలోకాల్లో బతకడానికి మీరు అలవాటు పడి పోయారు. నలుగురూ మిమ్మల్ని చూసి ఏమనుకొంటున్నారో మీకు తెలియదు. ఆఖరుకు – మీరు పూజిస్తున్న భగవంతునికికూడా మీమీద సదభిప్రాయం లేదు."

" నాదగ్గర కొస్తున్నప్పుడు కూడా, ఉత్తిచేతుల్తో వస్తున్నాడేమిటి, ఈ పిసినారి వెధవ? ' అని , భగవంతుడు, మీ గురించి అనుకోకుండా, కాపాడినందుకు, మీరేనాకు కృతజ్ఞతలు చెప్పవలసింది పోయి, నాకు హితబోధ చేస్తారేమిటి?" అన్నది గన్నేరుపూవు. అటూ ఇటూ కదులుతూ.

ఎవరో వెన్నుచరిచినట్లయింది శంకరయ్యకు.

తను చేస్తున్న పొరపాటేమిటో, అప్పుడుగానీ, ఆయనకు అర్థం కాలేదు.

అర్థమయ్యాక, ఆ గన్నేరుపూవును కళ్ళకద్దుకొన్నారు.

# విశ్వాసం

అన్ని సంవత్సరాలకన్నా, ఈ ఏడాది ఎండలెక్కువగా ఉన్నాయి. ఉగాది వెళ్ళి ఇంకా మూడునాలుగు వారాలన్న కాలేదు. అప్పుడే సూర్యుడు చిటపట లాడేస్తున్నాడు. చిన్నా పెద్దా చెరువులు క్రమంగా ఎండిపోతున్నాయి. ఉదయం పూటా, సాయంకాలం పూటా తప్ప మధ్యాహ్నం వేళ – అలా బయటికి కాలు బెట్టాలన్నా భయంగానే ఉంది. పచ్చిక మీది నించి వస్తున్న గాలులయినా సరే – వెచ్చగానే ఉన్నాయి.

అయితే డబ్బున్న వారికీ బాధలేవీ తెలియవు. తెలిసే అవకాశమూ లేదు. వారికి కావలసిన వన్నీ వారి చుట్టూతా ఉంటాయి. ఉండనివాటిని, పనివారు తీసుకొచ్చి పెడతారు. ఎండలు – చిటపటలాడతాయన్నా, గాలి కాలిపోతూ ఉంటుందన్నా వారికర్థం కాదు. అర్థంకాక వారు ఆశ్చర్యపోతూ ఉంటారు.



భగవంతుడు గొప్పవాడు గదా! అందర్నీ భాగ్యవంతుల్నిగా పుట్టించడం ఆయనకూ ఇష్టంలేదు గదా! కొంతమందయినా పేదవారు లేకపోతే, భాగ్యవంతులకు తాము సంపన్నులమన్న సంగతి కూడా తెలియదు గదా!

చిత్రమేమిటంటే – ఈశ్వరుని సృష్టిలో సంపన్నులకన్నా, పేదవారే ఎక్కువ సంఖ్యలో ఉండడం. ఎందుకంటే పేదవారంటే ఈశ్వరునికి చాలా ఇష్టం గనక!

అలాగా –

ఈశ్వరునికి చాలా ఇష్టమయిన వాటిల్లో ఆ సీతాకోక చిలుక కూడా ఒకటి.

అప్పటికే మధ్యాహ్నమయింది!

ఎండ నిప్పులు చెరగడం ప్రారంభించింది.

ఆ వేడిని భరించలేని నీడలు కూడా చెట్లకింది కొచ్చాయి, కాసేపన్నా తల దాచుకొందామని!

మొన్న మొన్నటి దాకా పచ్చగా ఉన్న ఆ మైదానం – ఎండదెబ్బకు వెండిలాగా తెల్లబడిపోయింది.

గలగల్లాడుతూ ఉండే చెరువు, ఇప్పుడు వెలవెల బోతూఉంది!

పదేళ్ళన్నా నిండని ఓ కుర్రాడు, పశువుల్ని కాస్తున్నాడు. మధ్యమధ్య చెరువు కట్టమీంచి ఊరు వేపు చూస్తున్నాడు – అన్నం తీసుకొచ్చే వాళ్ళమ్మ కోసం.

ఆ కుర్రవాణ్ణీ, వాడు కాస్తున్న పశువుల్నీ, చూస్తూ వాడి చుట్టూతా, ఆ పశువుల చుట్టూతా తిరిగి తిరిగి అలసిపోయి, ఆ చెట్టుకిందికి వచ్చిందో సీతాకోక చిలుక. వస్తూనే చిక్కని నీడ

పరుచుకొన్న ఓ మర్రి చెట్టుమీద మెల్లగా వాలింది.

"కాలం మారిపోయింది. కిందటేడాదికీ ఈ ఏడాదికీ సాపత్యమే లేదు. ఇంకా వైశాఖ మాసం మొదటి వారమన్నా రాలేదు. అప్పుడే ఎండలు చంపేస్తున్నాయి. ఈ ఎండలకు తట్టుకోవడం కష్టంగా ఉంది" అనుకొన్నదా సీతాకోక చిలుక.

ఎండలో తిరిగి తిరిగి రావడం వల్లా, ఒక్కసారే నీడకు చేరడం వల్లా, దాని కళ్ళకు బయర్లు కమ్మినట్టయి పోయింది.

కాస్సేపు కళ్ళు మూసుకొని తెరిచాక గానీ, తన పరిసరాల్లో ఏం జరుగుతున్నదీ దానికి బోధ పడలేదు.

నెర్రెలిచ్చిపోయిన సన్నని బాటమీంచి, ఆపసోపాలు పడుతూ, నడవలేక నడవలేక నడుస్తోన్న గండు చీమను చూసి, జాలి పడింది సీతాకోకచిలుక.

ఆ చీమకూడ ఆ మర్రి చెట్టు దగ్గరికే వచ్చింది. దాన్ని ఆనుకొని అలసట తీర్చుకొంటోంది.

సీతాకోక చిలుక రెక్కలను అల్లార్చుతూ, చీమకు దగ్గరగా జరిగింది.

"ఎండలు భగ్గుమంటున్నాయి. మనలాంటి సన్నకారు ప్రాణులు బతకడమే కష్టంగా ఉంది." అన్నది సీతాకోకచిలుక.

ఓసారి – వొంటినిండా దిగజారిపోతున్న చెమటను తుడుచుకొన్నాక – 'నిజమే' అన్నట్టు తల పంకించింది.

"అడుగు తీసి అడుగు బయటపెట్టడమే కష్టంగా ఉంది గదా! ఈ మిడసరి లగ్నంలో బయలు దేరారెందుకూ? మరీ పీకలమీది కొస్తే తప్ప – ఉదయ సాయంకాలాల్లో మినహా – బయటికి

రాకూడదు... బాగా అలసి పోయారు. చాలా దూరం నించి గానీ వస్తున్నారా?" అన్నది సీతాకోకచిలుక రెక్కలాడిస్తూ.

"అవునండి! చాలాదూరంనుంచే వస్తున్నాను" అన్నది చీమ.

ఆ మాటలంటున్నప్పుడు దాని కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

సీతాకోకచిలుక దాని కన్నీరు తుడిచి ఓదార్చింది.

"క్షమించండి చీమగారూ ! పిచ్చి పిచ్చి ప్రశ్నలన్నీ అడిగి, మిమ్మల్ని నొప్పించినట్టు ఉన్నాను. నేను మిమ్మల్ని అడిగింది కూడా– చేతనయితే సాయం చేదామన్న సదుద్దేశంతోనే గానీ – మరో అభిప్రాయంతో కాదండీ !" అన్నది సీతాకోక చిలుక నొచ్చుకుంటూ.

చీమ – మరోసారి కన్నీరు తుడుచుకొంది. ఓ పాడిదగ్గు దగ్గి, గొంతుకను సరిచేసుకొంది.

"మీరు మంచివారు. అంచేతనే నా యోగక్షేమాలడిగారు. నేనా చెరువుకు అవతలి వేపుగా ఉన్న పొలం దగ్గర్నించీ వస్తున్నాను. అక్కణ్ణించి ఇక్కడిదాకా, నన్నెరిగినవారూ,నేనెరిగినవారూ చాలామంది నాకెదురయ్యారు. కానీ ఎవ్వరూ నన్ను పలకరించింది ఈ రోజున – ఇంతవరకూ – మీరే మొదటివారు !" అన్నది చీమ.

"అదేమిటి చీమగారూ? అలా ఎందుకు జరిగింది? ఎక్కణ్ణించి వస్తున్నారనీ, ఎండలో ఎందుకెళతారనీ – మాట వరసకన్నా అడగొచ్చుకదా ! కనీసం ఆ పాటి మర్యాదకూడా వాళ్ళకు తెలియదంటారా?" అన్నది సీతాకోక చిలుక.

"నేను మామూలుగా ఉన్నప్పుడు – వీళ్ళందరకూ అన్ని మర్యాదలూ తెలుసు. ఇప్పుడు నాకు కాని కాలం వచ్చిపడింది. పలకరిస్తే, నేనేమన్నా సాయం చేయమంటానేమోనన్న భయంతో

వీరందరూ ముఖం తప్పిస్తున్నారు. విధిలేక ఎదురు పడిన సందర్భాల్లో నేనెవరో తెలియనట్లే వెళిపోతున్నారు" అన్నది చీమ.

"ఇంతకీ – మీరా పొలందాకా ఎందుకెళ్ళింది నేనడగనే లేదు" అన్నది సీతాకోక చిలుక.

చీమ – ఓక్షణం కళ్ళు మూసుకొంది. మూసుకొన్నాక తలవొంచుకొంది.

తరువాత మెల్లగా తలెత్తింది. ఆ తరువాత ఓ గుటక వేసింది.

"అక్కడ తిండి గింజలు పుష్కలంగా దొరుకుతాయని ఎవరో చెప్పారు. వారి మాటలు విని– అంతదూరమూ వెళ్లాను ...' అని ఆగి పోయింది చీమ.

"మీరు విన్నది అబద్ధమా? కొంత కొంతమందికి – ఓ పాడు గుణం ఉంటుంది. చీమగారూ ! ఎదుటి వారికి లేనిపోని ఆశలు కల్పిస్తారు. వాళ్ళ ఆశల వెంట పరుగులు తీస్తూ ఉంటే, వెనకనించి నవ్వుతారు. వారికదొక రాక్షసానందం. బహుశ – మీకీ కబురు చేరవేసిన వారు కూడా ఈ కోవకు చెందిన వారే అయి ఉంటారు. అవునా ?" అన్నది సీతాకోకచిలుక.

"కాదండీ!" అన్నది చీమ సీతాకోక చిలుకను వారిస్తూ "వారన్నది అక్షరాలా నిజం. అక్కడ చాలా తిండి గింజలున్నాయి."

"మరి – మీరు ఉత్తిగానే వచ్చారేం? ఏమీ తెచ్చుకోలేదేం? ఆలస్యంగా వెళ్ళారా?" అన్నది సీతాకోక చిలుక.

"లేదండీ! సకాలంలోనే వెళ్లాను. కానీ నాకన్నా ముందుగానే ఈ సంగతి పసికట్టిన గూండా చీమలూ, రౌడీ చీమలూ – నే వెళ్ళే సరికే గింజ మిగలకుండా దోచుకుపోయాయి. ఆఖరుకు పొల్లూ నెల్లూ

కూడా నాకు మిగల్లేదు." అని మళ్ళా ఏడ్చింది చీమ.

సీతాకోకచిలుక - మరో అడుగుముందుకు వేసి చీమను ఆలింగనం చేసుకొంది.

"ఊరుకోండి చీమగారూ! కష్టాలెనా అందరకూ రావు; భరించగలిగిన వారికే వస్తాయి." అన్నది సీతాకోక చిలుక.

"నాగురించి నా కెప్పుడూ బాధలేదు చిలకమ్మ గారూ! నేనేదో తెస్తాననీ కడుపారా తిందామనీ, నా పిల్లలందరూ ఎదురు చూస్తూ ఉంటారు. ఉత్త చేతులతో వాళ్ళ దగ్గరకెలా వెళ్లను ? ఈ పాడు ముఖం వాళ్లకెలా చూపించను?

ఈ రెండు మూడు రోజులనుంచీ, వాళ్ళకేదో మాయమాటలు చెప్పి మైదు చేస్తున్నాను. ఇవాళ - వాళ్ళు నా మాట నమ్మరు. ఆకలి - వాళ్ళను నమ్మ నివ్వదు" అన్నది చీమ.

సీతాకోక చిలుక సన్నగా నిట్టూర్చింది.

"చీమమ్మా ! కబుర్లలో పడి అసలు సంగతి అడగడం మరిచిపోయాను. ఇంత సేపణ్ణించీ మీరు, మీ గురించే చెబుతున్నారు. అసలీ గొడవలన్నీ పడవలసింది మగవారు గదా! వారిని గురించి మీరు మాట మాత్రంగా నన్నా ప్రస్తావించరే? వారు మంచివారు కాదా? మిమ్మల్ని మీ పిల్లల్ని పట్టించుకోరా? ముదనష్టపు సహవాసాలు మరిగీ, చెడు అలవాట్లు మరిగీ - పాడయి పోలేదు గదా!" అన్నది సీతాకోకచిలుక!

అది - ఆ వాక్య మింకా పూర్తిచేయకముందే, చెవులు మూసుకొంది చీమ.

"మావారు చాలామంచివారు. ఆయనకు ఏచెడు అలవాటూ

లేదు. నేనన్నా పిల్లలన్నా ఆయనకు చాలా ఇష్టం! ఆయనకీమధ్య – సుష్టి చేసింది.అంచేత ఎక్కడికీ కదల్లేకపోతున్నారు. ఆయనగారి ఆరోగ్యమే బావుంటే,నాకీ బాధలు ఉండేవేకావు.దాచుకొన్న కాసిని గింజలూ అయిపోయాయి.

"నాకోసం ఆయనగారూ పిల్లలూ ఎదురు చూస్తూ ఉంటారు.ఈ పాడుమొఖం వారికెలా చూపించాలో నాకు తెలీడం లేదు చిలకమ్మగారూ!"అన్నది చీమ బొంగురు పోయిన గొంతుతో.

"కన్న బిడ్డలకోసం తల్లి పడే బాధలేమిటో నాకూ తెలుసు. మీరేమీ అనుకోకండి! నా పిల్లల కోసమని, నేనుకొంచెం పుప్పొడి తీసుకు పోతున్నాను. అదీ – అవసరమయి కాదు నాకు – మా ఇంట్లో చాలా పుప్పొడి ఉంది. అయినా – అప్రయత్నంగా దొరికింది గదాని తీసుకెడుతున్నాను. దాన్ని మీకిస్తాను. పట్టుకెళ్ళండి. మీరూ, మీవారూ, మీ పిల్లలూ పుచ్చుకోండి. నా కింత పుణ్యమన్నా దక్కుతుంది!" అన్నది సీతాకోకచిలుక.

చీమ మౌనంగా ఉండి పోయింది.

ఆమౌనాన్నే అంగీకారంగా భావించిన సీతాకోకచిలుక, తనదగ్గరున్న పుప్పొడినంతా చీమకిచ్చేసింది!

" మీకెలాకృతజ్ఞతలు చెప్పాలో బోధపడడం లేదు. నేనూ, మావారూ, మా పిల్లలందరూ మీకు కలకాలం రుణపడి ఉంటారు". అన్నది చీమ పుప్పొడిని అందుకొంటూ.

సరిగ్గా –

ఆ జరగకూడనిదేదో – అప్పుడు జరిగింది!

చీమగారూ, సీతాకోకచిలుకగారూ మాటల్లో పడి, తమ చుట్టూ

ఏం జరుగుతున్నదో గమనించలేదు. ఏమాత్రం పసిగట్టినా- అవి - ముందుగానే జాగ్రత్త పడేవి.

అమ్మ తెచ్చే అన్నంముద్ద కోసం ఎదురు చూసీ చూసీ విసుగెత్తి పోయిన కుర్రాడు, పశువుల్ని బీట్లోకి తోలాడు. కాస్సేపు కునుకు తీద్దామని, చెట్టుకిందికొచ్చాడు.

మట్టి బెడ్డ పక్కగా నుంచుని రెక్కలూపుతున్న సీతాకోక చిలుకను చూశాడు. చడీచప్పుడూ లేకుండా వెనగ్గావచ్చి, సీతాకోకచిలుక రెండురెక్కలూ పట్టుకొన్నాడు.

సీతాకోకచిలుక ఉలిక్కిపడింది?

"ఇది అనుకోని సంఘటన. నాదురదృష్టం మిమ్మల్ని కూడా ముసురుకొంటున్నదని అనుకొంటున్నాను. నన్ను ఓదార్చుదామనీ, నాకేదో ఇంత సాయం చేదామన్న మంచి మనసుతో మీరు నా దగ్గర ఉండి పోయారు. ఆ కుర్రవెధవ మీ ప్రాణాల మీదికి తెచ్చిపెట్టాడు. దోషం నాది, శిక్షమీది. నా కింత సహాయం చేయాలన్న ఆలోచన మీకు రాకపోతే, ఈ ఆపద తటస్థ పడేదే కాదు చిలకమ్మగారూ!" అన్నది చీమ, బాధతో మెలికలు తిరిగిపోతూ.

సీతాకోకచిలుక ఆశ్చర్యపోతూన్నట్టుగ కళ్ళు పెద్దవిచేసి, చీమవేపు చూసింది.

"నేను విచారిస్తున్నది, నా కొచ్చి పడిన ఆపదను గురించి కాదు చీమగారూ! ఎంతో దూరంనించీ నడిచి నడిచి అలసిపోయి వచ్చారు. మీ వంటి చెమట ఆరేదాకానన్నా, మీకు విసరలేకపోయినందుకు బాధపడుతున్నాను గానీ, చావును గురించి కాదండీ! బాధపడినా

తప్పని వాటిని గురించి, ఆలోచించడం అనవసరమని ఎవరో చెప్పగా విన్నాను. నా కది నచ్చింది. అందుకనే – అలాంటి వాటిని గురించి, నేను ఆలోచించడం మానేశాను.” అన్నది సీతాకోకచిలుక.

ఆ సమాధానం విని,

చీమ ఆశ్చర్య పోయింది.

ఓ నిమిషమయ్యాక ఆశ్చర్యం నుండి తేరుకొంది. తేరుకొన్నాక ఆలోచించింది. ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాక – కొద్దిగా తలపంకించింది.

“చిలకమ్మగారూ! ఇప్పుడే నాకో ఉపాయం తోచింది. మీరు కదలకుండా, మెదలకుండా అతగాడి పాపిష్టి వేళ్ళ మధ్య అలానే ఉండండి. నేనీలోగా మెల్లగా వాణ్ని సమీపించి, కండలూడిపోయేలాగా కుడతాను. వాడు ఆ నొప్పిని భరించలేక ‘అమ్మా!’ అని అరుస్తూ మిమ్మల్ని వదిలేస్తాడు. మీరు రివ్వున ఎగిరిపొండి” అన్నది చీమ.

“మీ ఉపాయం బాగానే ఉంది!” అని ఫక్కున నవ్వింది సీతాకోక చిలుక. ”

“అందులో దాక్కున్న ప్రమాదం మీకు తెలుసునో లేదో మరి – తెలిసి కూడా జ్ఞాపకం చేయకపోతే నేను నేరం చేసినట్లవుతుంది. నన్ను కాపాడదామన్న సత్సంకల్పంతో, మీరతన్ని కుడతారు. అతనో గావు కేకపెట్టి, నన్ను విడిచిపెడతాడు. అంతవరకూ ఖచ్చితంగా జరుగుతుంది. ఆ తరువాత మరోటి కూడా జరుగుతుంది చీమగారూ!

మీరు కుట్టంగానే, అతగాడు ఊరుకోడు. మిమ్మల్ని – ఇలా నలిపి – అలా చంపేస్తాడు. సుష్టిగా ఉన్న మీవారూ, నోరూ వాయీ లేని మీపిల్లలూ అన్యాయమయి పోతారు. దయచేసి – నా ఒక్క

ప్రాణం కోసం ఇంత మందిని ఉసురు పెట్టకండి! మీరు ఆమాట అనడమే నాభాగ్యం." అన్నది సీతాకోక చిలుక.

తన చేతుల్లో ఉన్న పుప్పొడిని, మట్టి బెడ్డకు పక్కగా ఉంచి, సీతాకోకచిలుకకు సాష్టాంగ నమస్కారం చేసింది చీమ.

"చిలకమ్మగారూ! నేనెవరో తెలీదు. నాపేరేమిటో, ఊరేమిటో కూడా తెలీదు. నేను నిజమే చెప్పానో అబద్ధమే చెప్పానో కూడా మీకు తెలీదు.

అయినా! – నా బాధలను గురించి సూక్ష్మంగా మీకు చెప్పీ చెప్పక ముందే మీరు కరిగిపోయారు. మీ బిడ్డల కోసం తీసుకెడుతున్న పుప్పొడిని, నా బిడ్డలకు దానం చేసిన దయా హృదయం మీది. మీ వంటి ఉత్తములకోసం – ఒకసారికాదు – ఎన్నిసార్లు మరణించ డానికయినా నాకభ్యంతరంలేదు!" అన్నదా చీమ, ఆ పశువుల కాపరిని కుట్టడానికి మెల్లగా ముందుకు సాగుతూ.

# పశ్చాత్తాపం

వెళ్ళలేక, వెళ్ళలేక, మెల్లగా పైకి వెడుతోన్న ఆ మబ్బును చూస్తుంటే, సముద్రానికి కూడా జాలివేసింది.

"నిన్ను వెళ్ళమనడానికి నోరు రావడంలేదు. అయినా నువ్వు వెళ్ళక తప్పదు. నీకోసం ఎదురుచూస్తున్న వాళ్ళు చాలామంది ఉన్నారు. వారందరి ఉసురూ పోసుకోవడం నాకిష్టం లేదు. ఈ ఎడబాటు అట్టేకాలం ఉండదు. మళ్ళీ మనం తప్పకుండా కలుసుకొంటాం." అన్నది సముద్రం ఆ మబ్బు వేపు చూస్తూ.

దిగులు దిగులుగా ఉన్న ఆ మబ్బునుచూసి, గాలికూడా జాలిపడింది.

"ఇదేదో నీకు మాత్రమే జరిగిందని అనుకోకు. వేల సంవత్సరాల నుంచీ, లక్షల సంవత్సరాల నుంచీ ఇలా జరుగుతూనే ఉంది. నీ కింకో



రహస్యం చెప్పనా? ఈ భూమండలం మీద – ఏ రూపంలోనైనా సరే – జీవం ఉండడానికి నీవే కారణం. చిన్న చిన్న మొక్కల్లోనూ, మహారణ్యాలలోనూ, నీవు ఉన్నావు. కంటికి కూడా కనిపించని సూక్ష్మజీవిలోనూ, కొండంత ఏనుగులోనూ నీవు ఉన్నావు. " అన్నది గాలి మెల్లగా సాగుతూ.

దానితోపాటే, మబ్బుకూడా అడుగులో అడుగు వేసుకొంటూ బయలుదేరింది.

"నీవు రావడం ఆలస్యమయితే జనం దాహంతో చచ్చిపోతారు. అరణ్యాలు ఎండి పోతాయి. నువ్వు దాక్కున్న అడుగు పొరల దాకా మనుషులు తవ్వుకొంటూ తవ్వుకొంటూ పోతారు. నువ్వు దాక్కున్న అంతంత లోతుల్లోంచి కూడా నిన్ను పైకితోడుకొంటారు. నువ్వు దయతలచిన సంవత్సరం, సమస్త జీవకోటీ సంతోషిస్తుంది. నీకు కోపమొస్తే మాడిపోతుంది." అన్నదిగాలి– నడకవేగాన్ని కొంచెంగా ఎక్కువ చేస్తూ.

గాలి వేగంతో బాటు, మబ్బుకూడా తన వేగాన్ని పెంచింది!

"నాకోచిన్న అనుమానం కలిగింది. నువ్వేమీ అనుకోనంటే, నా సందేహాన్ని బయటపెడతాను" అన్నది మబ్బు.

"ఏమీ అనుకోను. అడగదలచిందేదో నిస్సంకోచంగా అడుగు. నాకు తెలిస్తే – వెంటనే చెబుతాను. తెలియకపోతే – ఆసంగతి తెలిసిన వారినడిగి, నీకు చెబుతాను. " అన్నది గాలి.

"జీవకోటి బతకడానికి నేను ముఖ్యమన్నావు. బాగానే ఉంది. నేను మాత్రమే ముఖ్యమా? ఇంకెవరూ ముఖ్యం కాదా? నేనే ముఖ్యమయ్యే పక్షంలో – మిగిలిన వారందరూ ఎందుకున్నట్టు?" అన్నది మబ్బు.

గాలి ఒక్క నిమిషం తబ్బిబ్బు పడింది.

" నీవు ముఖ్యమే ! సందేహం లేదు. నీకన్నా నేను మరీ ముఖ్యం. నీవులేకుండా గంటలపాటు, రోజులపాటూ మనుషులు బతికిన సందర్భాలున్నాయి. నేను లేకుండా అయిదు నిమిషాలు –

పోనీ పదినిమిషాలనుకొందాం– అంతకు మించి బతికిన వారు లేరు.

"అయినా ఆత్మస్తుతి అంటే నాకిష్టం లేదు. అందుకే నాగురించి, నేనేమీ చెప్పుకోను. మొక్కలన్నా, మనుషులన్నా రకరకాల ప్రాణులన్నా నాకిష్టం. వారందరికీ నేను కావాలి. నాతో బాటు నువ్వూ కావాలి. అందుకే – నిన్ను పనిమాలా నీ అవసరం ఉన్నచోటుకు నేను తీసుకు పోతున్నాను " అన్నది గాలి.

దూరంనించి, ఏవో పాటలూ, చప్పుళ్లూ, ప్రార్థనలూ, సుడులుగా లేగుతున్న పొగలూ కనిపించాయి.

"ఇవన్నీ ఏమిటి?" అన్నది మబ్బు.

"నీ రాకకోసం ఎదురు చూస్తున్న వారి ఆదుర్దాకు ఇవన్నీ చిహ్నాలు. నిన్ను తొరగా రమ్మనీ, వర్షంగా కురవమనీ, జనం పాటలు పాడుతున్నారు. కొంత మంది ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నారు.యజ్ఞాలూ, యాగాలూ చేయడం వల్ల, నీ ఆగమనం వేగవంతము అవుతుందనీ, నీ దర్శనంతొరగా లభిస్తుందనీ, నమ్ముతున్న వారు, ఆ పనులూ చేస్తున్నారు. ఆ పొగల సుడులన్నీ, ఆ యజ్ఞగుండాల నుంచే వస్తున్నాయి." అన్నది గాలి.

ఆ మబ్బు– తనను తానొకసారి చూసుకొంది. కిందికీ చూసింది!

" ఆ కొండకు ఈ అంచునించి, యోజనాల పర్యంతం విస్తరించిన, ఆకుపచ్చ రంగు – నిజంగా రంగు కాదు – అది మహారణ్యం! ఎన్ని వందల సంవత్సరాల కిందనో, మీవారు, దయదలచిన కారణంగా, అక్కడో మహారణ్యం వెలిసింది. ఇన్ని శతాబ్దాలుగానూ, మీవారందరూ, ఈ ఆచారాన్ని పాటిస్తూనే ఉన్నారు. సముద్రాల మీంచి, మిమ్మల్ని ఇక్కడికి తీసుకొస్తాం మేము. ఈ పచ్చదనానికీ, చల్లదనానికీ మీరు కరిగిపోతారు. వానయి, కాలువలయి, వాగులయి, ఉపనదులయి, మహానదులయి, తిరిగీ సముద్రంలోకి చేరుతారు. ఈ మహారణ్యాలన్నీ మనరాకకోసం ఎదురు చూస్తున్నాయి. సాయంవేళకల్లా, మనమక్కడికి చేరుకొంటాం!" అన్నది గాలి.

వానమబ్బు ముఖం ముడుచుకొంది. తనలో తనే ఏదో గొణుక్కుంది.

"మరి– మనకు కుడివేపుగా ఉన్న ప్రాంతాలన్నీ ఎర్రగా ఉన్నాయేం? దుమ్ము దుమ్ముగా ఉన్నాయేం? ఎండిపోయి ఉన్నాయేం? నెర్రలిచ్చి ఉన్నాయేం? ఎందుకిలా జరిగింది?" అన్నది వానమబ్బు.

"చాలా సంవత్సరాలుగా ఇక్కడ వానల్లేవు. వానల్లేని కారణంగా పచ్చని మొక్కలు లేవు. తాగడానికి కూడా నీళ్ళు దొరకని ప్రజలు ఈ ప్రాంతాలన్నింటినీ ఖాళీ చేసి, అవి – పుష్కలంగా దొరికే చోట్లకు వలసవెళ్ళారు. ఇప్పుడిది ఎడారి ప్రాంతం కిందలెక్క?" అన్నదిగాలి.

"ఈ ప్రాంతమిలా కావడానికి వానల్లేకపోవడమే కారణమా?" అన్నది మబ్బు.

"బాగా సెలవిచ్చారు. సరిగ్గా అదేకారణం?" అన్నది గాలి.

మబ్బు – ఆ కింది వేపుకు చూస్తూ అక్కడే నిలబడింది.

"ఇక్కడ చూడ్డానికేమీ లేదు. పదితాడి చెట్లలోతు తవ్వినా, నీటితేమ కూడా కనిపించదు. రండి వెడదాం! సాయం కాలానికల్లా, మనమూ అరణ్య ప్రాంతాలకు వెళ్ళాలంటే, ఎక్కడా ఆలస్యం చేయకూడదు. నడకవేగం కూడా కాస్త పెంచాలి" అన్నది గాలి, కొంచెంగా ఊపిరి పీల్చుకొని, సాచి అంగలు వేస్తూ.

మబ్బుమాత్రం –అక్కణ్ణించి కదలనన్నా కదల్లేదు.

"రారేం?" అన్నది గాలి కొంచెం ఆశ్చర్యంగా.

"నేనిక్కడే ఉండిపోదామనుకొంటున్నాను" అన్నది మబ్బు.

"ఇక్కడా? ఈ ఎడారిలోనా? ఇక్కడుండి నువ్వు చెయ్యబోతున్నదేమిటి?" అన్నది గాలి ఆశ్చర్యపోతూ.

" ఆ అడవి దగ్గరకెళ్ళి చేయవలసిందేమిటో ఈ ఎడారిలోనూ అదే చేస్తాను. అరణ్య ప్రాంతం సంపన్నమయింది. దాన్నిఇంకా సంపన్నం చేయడానికి తెకతెకలాడడంలో అర్థం లేదు. ఈ ఎడారి

ప్రాంతం పేదది. దీనికి దిక్కూ మొక్కూ లేదు. దీనివేపు చూస్తున్నవారుకూడా లేరు. నిజంగా నీ అవసరం – ఇక్కడున్నంతగా, ఆ ప్రాంతాల లేదు" అన్నది వానమబ్బు ఓసారి తళుక్కుమని మెరుస్తూ.

"ఎక్కడెక్కడినుంచో, బోలెడంత నీటిని మోసుకొస్తున్నారు. ఈ జల సంపదను సద్వినియోగం చేసుకొనే చోట పంచాలిగానీ, ఎడారిలో చిలకరించడంలో అర్థంలేదు. నా మాటవిను. నిన్ను అరణ్యం దాకా తీసుకుపోతాను పద" అన్నదిగాలి, మబ్బును బలవంతాన ముందుకు నెడుతూ.

అంతదాకా మెత్తగా ఉన్నమబ్బు, ఒక్కసారి పెద్దగా ఉరిమింది.

" నాపూర్వీకులు ఎప్పుడో, ఏకారణం చేతనో ఓ తప్పు చేశారు. ఆ పొరబాటు కారణంగా ఈ ప్రాంతమంతా, నిర్జీవమైన ఎడారిగా మారిపోయింది. ఆ దోషం అలానే జరుగుతూ ఉండాలనడం న్యాయం కాదు. ఒకప్పుడెప్పుడో జరిగిన ఒక పొరబాటును – ఎప్పుడైనా సవరించుకోవచ్చు. నేనిప్పుడు సవరించుదామను కొంటున్నాను. నన్నోసారి ప్రయత్నించనివ్వండి. నేను– మోసుకొచ్చిన జలసంపదంతా ఈ ఎడారిలో చిందిపడి ఇంకిపోయిందనుకోండి. తప్పులేదు.

కానీ – అవసరం ఉన్న ఓ చిన్న బీజం – ఏ లోతుల్లోనో, ఏ అడుగుపొరల్లోనో, కొనప్రాణంతో గుటగుటలాడుతూ ఉండవచ్చు. నేను తెచ్చిన నీటిలో నించి ఒక్కచుక్క – ఒకే వొక నీటిచుక్క ఆ విత్తనానికే అందితే, ఆ విత్తనం దాన్ని స్వీకరించి పచ్చగా నవ్వితే, నా జన్మ ధన్యమయినట్లే!" అన్నదా వర్షమేఘం మరోసారి మెరిసి, ఇంకోసారి ఉరిమి చినుకులుగా చిరిగి పోతూ.

* * *

# సార్థకం

ఒకప్పుడు రామాపురం గ్రామంలో రామనాథంఅనే సంపన్నుడు ఉండేవాడు. ఈ సంపద వారి పూర్వీకులిచ్చింది కాదు. రామనాథంగారే కష్టపడి సంపాదించారు.

ఎక్కడా లేని సంపద, ఒక చోట పోగు పడిందంటే, ఆ కుప్ప వెనుక చాలా అన్యాయాలు, అక్రమాలు, అధర్మాలూ ఉంటాయని, అందరూ అంటూ ఉంటారు. అది - అక్షరాలా నిజమయినా కాకపోయినా, రామనాథం గారి సంపాదనలోమాత్రం అన్యాయమంటూ ఏదీ లేదు.

ఆయన తన ఆదాయాన్ని పెంచుకొంటూ పోయాడు. తన ఖర్చులను మాత్రం పెరగనివ్వలేదు. వ్యయానికి మించి వచ్చిన ఆదాయంలో, చాలాభాగం దాచి ఉంచాడు. ఆ దాచిన మొత్తం పెరిగీ పెరిగీ అతన్ని భాగ్యవంతుణ్ని చేసింది!



కొంతమంది సంపన్నులలో ఎదుటి వారిని హీనంగా చూడడమూ, తమను తాము గొప్పచేసుకోవడమూ కనబడుతుంది. తమ దగ్గరకు వచ్చేవారందరూ తమనించి ఏదో ఒకటి ఆశించి మాత్రమే వస్తూంటారని మరి కొంతమంది, అనుకోవడమూ కద్దు.

రామనాథం ఈ ధోరణికి పూర్తిగా విరుద్ధమైన మనిషి!

"రామాపురంలో చాలామంది ధనవంతులున్నారు. వారందరినీ కాదని నా దగ్గరకే వచ్చారంటే నా అదృష్టమే కారణం!" అనేవారు రామనాథంగారు తనను చూడడానికొచ్చిన వారితో.

"నాకుకొంచెం పుణ్యం సంపాదించుకొనే అవకాశం మీరు ఇచ్చినందుకు, మీకు నేను కృతజ్ఞలు చెప్పుకోవాలి. నేను ఇచ్చిన ఈ కొద్దిపాటి విరాళం, మీకెవరయినా ఇస్తారు. కానీ – మీలాంటి మంచివారికి సాయంచేసే అవకాశం, నాకు ఎంతమంది కలిగిస్తారు గనక?" అంటారాయన.

రామనాథంగారు చాలామందికి చాలా రకాలుగా సాయంచేశారు. ఎవరికి ఏ సాయం చేసిందీ ఇంకొకరికి తెలియదు. ఆయనగారూ తెలీయ నివ్వరు.

ఆయన అలవాట్లు కూడా–కొంచెం ప్రత్యేకంగా ఉంటాయి.

బాగా చీకటితో లేస్తారు. స్నానాదికాలు పూర్తిచేసు కొంటారు. గుప్పెడు చిల్లర జేబులో వేసుకొని, వేకువ జామునే నడవడం ప్రారంభిస్తారు. తన దగ్గర ఉన్న ఆఖరు పైసా కూడా అయిందాకా, అలా ఇచ్చుకొంటూనే పోతారు.

ఈ లోగా మొక్కల్నీ మాకుల్నీ పలకరిస్తూ ఉంటారు. చిన్న చిన్న మొక్కలకు పాదులు చేస్తారు. వాటిని గొడ్డు గోదా తినకుండా, ముళ్ళకంపను అడ్డు పెడతారు. కళ్ళు లేనివారికీ, పసిపిల్లలకూ తోడుగా ఉండి నడిపిస్తారు. నిజమోకాదో తెలీదు గానీ ఆయన్ని చూసి, మానులు కూడా వంగి నమస్కారం చేస్తాయని చెబుతారు.

ఒకరోజు వేకువజామున రామనాథంగారు తల వంచుకొని

నడుస్తున్నారు.

ఎవరో పాడిదగ్గు దగ్గినట్లు వినిపించి ఆగిపోయారు. ఆగిపోయి చుట్టూరా చూశారు. ఎవరూ కనిపించలేదు.

రామనాథం గారు – మరో అడుగు ముందుకు వేశారు.

ఈసారి "బాబుగారూ!" అని బలహీనంగా వినిపించింది.

రామనాథంగారు ముందు కేసిన అడుగు వెనక్కు తీసుకొన్నారు. మరోసారి చుట్టూరా పరికించి చూశారు. చూసినంతమేరా ఎవరూ కనిపించలేదు. ఆయనగారు సన్నగా నిట్టూర్చి మళ్ళా అడుగు ముందుకు వేశారు.

"బాబుగారూ! మీ గురించి వారూ వీరూ చెప్పుకోవడం విన్నాను. మిమ్మల్ని చూడాలని నా కోరిక కానీ – అట్టడుగున ఉన్న కారణంగా మిమ్మల్ని చూడలేక పోతున్నాను. మొన్నా, నిన్నా కూడా నేను మిమ్మల్ని పిలిచాను. మీరు ఇంకేదో ఆలోచనలో ఉన్నారేమో– నా పిలుపు వినిపించు కోకుండా వెళ్ళారు. క్షమించండి – అదీ సరికాదు మీకు వినిపించేలా పిలకపోవడం నాదేతప్పు. ఇవ్వాళ మీరొస్తున్నారని నా పైవాళ్ళు చెప్పారు. కాస్త గొంతు పెంచి పిలిచాను. మీకు వినబడింది. అది నా అదృష్టం!" అని వినిపించింది.

రామనాథం ఆశ్చర్యపోయాడు.

చుట్టు పక్కలెక్కడా ఎవరూ కనబడరు. అయినా చక్కని గొంతుతో మాటలు వినబడుతున్నాయి.

రామనాథం రెండు చేతులూ కలిపి నమస్కారం చేశారు.

"మీరెవరో నాకు తెలీదు. మిమ్మల్ని నేను చూడలేక పోతున్నాను. మీరు ఎక్కడున్నారో చెప్పండి. నేనే మీదగ్గరకు వస్తాను" అన్నారు రామనాథం.

"నేను మీపక్కనే ఉన్నాను. మీ కుడి చేతి పక్కగా రాళ్ళకుప్ప ఉంది చూశారా? ఆ కుప్ప అడుగున ఉన్నాను. నేనా రాళ్ళను తొలగదీసుకొని పైకి రాలేను." అని వినిపించింది.

"అయితే మీరలానే, అక్కడే ఉండండి! నేను రాళ్ళను తీస్తాను" అన్నారు రామనాథం. అనడమేకాదు. రెండు చేతులతోనూ, రాళ్ళను ఎడాపెడా తీయడం ప్రారంభించారు.

"బాబుగారూ! నామీదగల దయతో మీరు తొందరపడుతున్నారు. దయచేసి కొంచెం నెమ్మదిగా, ఆ రాళ్ళను పక్కకు తొలగించండి. నాది అల్పప్రాణం. ఏ మాత్రం వత్తిడి తగిలినా, నేను పిండి పిండయి పోతాను" అని వినిపించింది.

ఈసారి ఆ గొంతులో, కొంచెం భయపునీడలు ఉండడాన్ని రామనాథంగారు గమనించారు.

"ఇంతసేపూ అడగడనందుకు – నన్ను మన్నించండి... మీరేమిటి?" అన్నారు రామనాథం చెవులు రిక్కించి.

"జొన్నగింజ!" అని వినిపించింది.రామనాథం ఆశ్చర్యపోయారు తన ఆశ్చర్యాన్నంతా లోలోపలే దాచుకొని, మెల్లగా రాళ్ళను తొలగించడం ప్రారంభించాడు. కాసేపటికల్లా – ఓ చిన్నరాతికున్న పల్లంలో ఓ పచ్చని జొన్నగింజ కనిపించింది.

"మీకు నేనెలా కృతజ్ఞతలు చెప్పాలో కూడా తెలీడంలేదు. వారూవీరూ మీ గురించి చెబుతుంటే 'అయిఉండవచ్చు' అనుకొన్నాను గానీ, మరీ మీరింత మంచివారనుకోలేదు." అన్నది జొన్నగింజ.

రామనాథం ఆ జొన్న గింజను అరచేతిలో ఉంచుకొని పరిశీలనగా చూశారు.

"పాపం! చాలాకాలంగా, ఆ రాళ్ళమధ్య పడిఉన్నావేమో – బాగా భయపడి ఉంటావు. భగవంతుడు దయామయుడు ఆపదలో ఉన్న నీ వంటి వారికి సహాయపడే అవకాశాన్ని నాకిచ్చాడు" అన్నారు రామనాథం!

ఆ జొన్న గింజ తల అడ్డంగా తిప్పింది. 'ఆగమన్నట్టు చేసైగ కూడా చేసింది.

"బాబూగారూ, మీరు – మరోలాగా అనుకోకండి! నేను

మిమ్మల్ని పిలిచింది భయంవల్లకాదు. నన్ను ఆదుకొంటారనీ కాదు. నేను ఆరు బయట ఉన్నాననుకోండి. ఏ పక్షికో, ఏ చీమకో ఆహారంగా ఉపయోగపడతాను.

భూమిలో తలదాచుకొన్నాననుకోండి; నాకు వంద రెట్లకు మించిన ప్రతిఫలాన్ని ఇవ్వగలుగుతాను.

అటూ ఇటూ ఎటూ గాకుండా, నా బతుకు వృథా అయిపోతున్నదన్న విచారంతో మిమ్మల్ని పిలిచాను గానీ, ప్రాణభయంతో కాదండీ!" అన్నదా జొన్నగింజ!

రామనాథం నిర్విణ్ణుడయ్యాడు.

*

# ఉత్తమజన్మ

ఒకప్పుడు కృష్ణానదీ తీరంలో 'పగడాలపాలెం' అన్న చిన్న ఊరు ఉండేది. ఒకప్పుడా ఊరినిండా పగడాలు పరుచుకొని ఉండేవట. అందుకని ఆ ఊరికాపేరు వచ్చిందని చెబుతారు.

మనకథా కాలంనాటికి ఆ ఊళ్ళో పగడాలన్నీ కథల్లోకీ, కబుర్లలోకీ వెళ్ళిపోయాయి. ఆ కబుర్లు చెప్పుకొంటూ, కలలు కంటూ బతికే, కటికపేదలు మాత్రమే ఉన్నారు. ఈ పేదలందరిలోకీ పేదరాలు సుబ్బక్క.

సుబ్బక్క అసలు పేరేమిటో ఎవరికీ తెలీదు. సుబ్బక్కకూ తెలీదు. ఆమెగారిది అసలా ఊరు కానే కాదు. ఏ ఊరో తెలిసిన ఒక్క మనిషీ చనిపోయాడు. తన ఊరేమిటో, తన పేరేమిటో, తన అమ్మ పేరేమిటో, నాన్న పేరేమిటో కూడా సుబ్బక్కకు తెలియదు.



" మీరందరూ డబ్బుకు పేదవారు. నేను పేరుకూ, ఊరుకూ, అమ్మకూ, నాన్నకూ కూడా పేదదాన్ని!" అనేది సుబ్బక్క.

దిక్కూ మొక్కూ లేని అనాధ కావడంవల్ల, అందరూ అన్నిపనులూ చెప్పేవారు సుబ్బక్కకు. ఆవిడ విసుక్కొనేది కాదు. ఎవరే పని చెప్పినా చేసేది. ఆ చేసిందానికి ప్రతిఫలంగా ఎవరెంత ఇస్తే అంతే పుచ్చుకొనేది.

సుబ్బక్క ఆమాయకురాలని ఊరి వారందరికీ తెలిసిపోయింది. ఎవరేపని చెప్పినా కాదనుకుండా చేస్తుందనీ తెలిసిపోయింది. ఆమె మంచితనాన్నీ అమాయకత్వాన్నీ చాలామంది దుర్వినియోగం చేసుకొనేవారు.

పాపం! ఈ సంగతులేవీ సుబ్బక్కకు తెలీవు.

"వాళ్ళక్కావలసిందేదో వాళ్ళడిగారు. చేయగలిగినంత సాయమూ చేశాను" అనుకొనేది సుబ్బక్క.

సుబ్బక్క ఓపికను చూసీ, మంచి తనాన్ని చూసీ, సుబ్బయ్య ముచ్చట పడ్డాడు. ఆయన కూడా దిక్కులేనివాడే! ఆయన కూడా పొట్టచేత పట్టుకొని పగడాలపాలెం వచ్చినవాడే!

ఊరి పెద్దలందరూ కూడబలుక్కొని సుబ్బక్కకూ, సుబ్బయ్యకూ రాములవారి గుళ్ళో పెళ్ళిచేశారు.

సుబ్బయ్యకు చేపలు పట్టడం తెలుసు. ఎప్పుడు 'గాలం' వెయ్యాలో, ఎప్పుడు 'వల' విసరాలో, ఎప్పుడు 'మావు' పన్నాలో అతనికి తెలుసు.

సుబ్బయ్య గాలం విసిరినప్పుడు నీటమీద తేలుతున్న బెండుముక్క వేపు చూస్తూ ఉండేది సుబ్బక్క. బెండుముక్క

కదిలిందంటే, దానికికట్టిన దారంకూడా కదిలిందన్నమాట. దారం కదిలిందంటే దాని చివరున్న ఇనుప కొక్కెం కదిలిందన్నమాట. ఇనుప కొక్కెం కదిలిందంటే దానికి గుచ్చిన ఎరను తినడానికి చేప వచ్చిందన్నమాట.

ఎరదాకా చేపరావాలేగానీ – వచ్చాక, దానిని చూడకుండానూ ఉండదు. చూశాక తినేందుకు ప్రయత్నం చేయకుండానూ ఉండదు. ప్రయత్నం చేశాక, గాలానికి గుచ్చుకోకుండానూ ఉండదు. ఒక్కసారి గాలానికి గుచ్చుకొన్న చేప తప్పుకోవడం సాధ్యం కానేకాదు.

గాలంతో చేపలు పట్టడమూ ; వలతోనూ, మావుతోనూ చేపలు పట్టడమూ; సుబ్బక్క నేర్చుకోవడానికి మూడు నాలుగేళ్ళు పట్టింది. ఈ లోగా ఆమె ఇద్దరు బిడ్డలకు అమ్మకూడా అయింది.

సుబ్బయ్య చేపలు పడుతుంటే, సుబ్బక్క వాటిని అమ్ముకొస్తుండేది. వారిద్దరినీ చూసి, "సీతారాములు" అనుకొనే వారు జనం!

ఎవరి దిష్టి తగిలిందో తెలియదు. ఏనాటి కర్మమో తెలియదు. ఎవ్వరూ ఊహించని సంఘటన జరిగింది.

పెద్ద పెద్ద చేపలను పట్టుకొందాం గదా అనుకొని, చెరువు మధ్యదాకా వచ్చిన సుబ్బయ్యకు, చెరువు మధ్య – ఊబి ఉన్న సంగతి తెలియదు. పొరబాటున అందులోకాలు వేశాడు. తిరిగి, వెనక్కు తీసుకొనే అవకాశం కూడా లేకపోయింది. అలానే లోపలికి కూరుకుపోయాడు.

సుబ్బక్కకు మళ్ళీ కష్టకాలం ప్రారంభమయింది! ఇది వరకంటే తన పొట్టమాత్రమే తనకు సమస్య. ఇప్పుడు –మరో ఇద్దరు తనమీద

ఆధారపడి ఉన్నారు. ఆ ఇద్దరూ చిన్న బిడ్డలు. అమ్మతప్ప- ఆకలయినప్పుడు "అమ్మా!" అని పిలవడం తప్ప ఇంకేమీ తెలియని చిన్నపిల్లలు!

లోగడ మాదిరిగా, ఆ పనీ ఈ పనీ చేసుకు బతకడానికి కూడా ఇప్పుడు వీలుపడదు. తను ఎక్కడికి వెళ్ళినా, నీడల్లాగా తనవెంట వచ్చే ఇద్దరు బిడ్డలున్నారు. వీరినేం చేసేట్టు.

కూడబెట్టుకున్న నాలుగు డబ్బులూ అయిపోయాయి. కంచమూ, మంచమూ అమ్ముకొని ఇంకొన్ని రోజులు బతికారు. అప్పులు చేసి, మరో వారం రోజులు గడిపారు. అప్పుతీర్చే అవకాశం సుబ్బక్కకు లేదని తెలిశాక, ఊరివారెవరూ అప్పులివ్వడమూ లేదు.

వారినీ వీరినీ యాచించడమూ, దేబెరించడమూ సుబ్బక్కకు ఎంతమాత్రం ఇష్టంగా లేదు. తన భర్త చేసిన వృత్తినే తనూ చేయాలనుకొంది. వంకెకున్న వలను తీసుకొని , ఇద్దరు బిడ్డలను వెంటబెట్టుకొని, చెరువు దగ్గర కొచ్చింది! వలను విసిరింది. సాయంకాలం దాకా చూసినా, ఒక్క చేపా పడలేదు.

ఆరాత్రి అక్కడే పడుకొంది సుబ్బక్క.

ఆ మర్నాడూ, ఆ తరువాత రోజూ కూడా ప్రయత్నించింది. ఎవరో శాపం పెట్టినట్టు, ఒక్క చేపకూడా వలలో పడలేదు. చేపలు పడితే తప్ప, తను వాటిని అమ్ముకోలేదు. అమ్మితే తప్ప డబ్బులు రావు. డబ్బులొస్తే తప్ప బియ్యం కొనలేదు. బియ్యముంటే తప్ప తను వండి పెట్టలేదు. ఆ వండింది తిన్నాక గానీ, బిడ్డల ఆకలీ తీరదు. ఆకలి తీరిందాకా, బిడ్డలలా ఏడుస్తూనే ఉంటారు.

సుబ్బక్క, ఆమె ఇద్దరు బిడ్డలూ చెరువు దగ్గరే ఉన్నారనీ, గడచిన మూడు రోజులుగా వాళ్ళకు మెతుక్కూడా లేదనీ, బిడ్డలిద్దరూ, 'ఆకలి , ఆకలి' అంటూ ఏడుస్తున్నారనీ, ఆ దోవన వస్తూ పోతూ

ఉన్న వారందరికీ తెలుసు. వారి ద్వారా ఊరివారందరికీ తెలుసు.

అయినా ఎవ్వరూ సుబ్బక్కను పలకరించలేదు. ఎవరింత అన్నం పెట్టాలిసొస్తుందోనని ఊరి వారిభయం.'

కళ్ళలో ప్రాణాలు పెట్టుకొన్న బిడ్డల కేసి చూసింది సుబ్బక్క. ఆమెకు ఏడుపు ఆగలేదు. ఇద్దరు పిల్లలనూ కావలించుకొంది. గుండెలకు హత్తుకొంది. వారి శరీరాలను తడిమింది. పదే పదే ముద్దులు పెట్టుకొంది. వారిని చూస్తూ మెల్లగా చెరువులోకి దిగింది.

మరో అడుగు ముందుకేసింది. ఆమె నడుం దాకా నీళ్ళొచ్చాయి. ఇంకోసారి పిల్లల వేపు చూసింది. ఇంకో అడుగు వేసింది. ఈసారి గుండెల దాకా నీళ్లొచ్చాయి. మరోసారి బిడ్డల వేపు చూసింది. మరో అడుగు వేసింది. ఈసారి గొంతుదాకా నీళ్లొచ్చాయి.

అమ్మ తలకాయ మాత్రమే కనబడుతోంది. అమ్మంతా ఏమయిందీ అన్న ఆలోచన వచ్చింది బిడ్డలకు. వారికి సమాధానం దొరకలేదు. పైగా తట్టుకోలేనంత భయం వేసింది.

"అమ్మా!" అంటూ ఇద్దరు బిడ్డలూ లేచారు. నీరసంగా నీటి అంచుదాకా వచ్చారు. ఒక్కో అడుగు నీళ్ళల్లోకి వేస్తూ వేస్తూ ముందుకు రావడం చూసింది సుబ్బక్క!

"కన్నలూ!" అంటూ గబగబా వొడ్డుకొచ్చింది. ఇద్దరు బిడ్డల్నీ కావలించుకొని వెక్కివెక్కి ఏడ్చింది సుబ్బక్క.

ఓసారి చెరువు వేపు చూసింది. మరోసారి వలవేపు చూసింది. ఇంకోసారి తనబిడ్డలవేపు చూసింది. ఆఖరు సారిగా ఆకాశం వేపు చూసింది.

చూశాక – సత్తువ కొద్దీ – చెరువులోకి వలవిసిరింది సుబ్బక్క!

ఆ వల దాపులోకి ఓ పెద్ద చేప రాబోతూ ఉంటే, పిల్ల చేపలన్నీ గోలపెట్టాయి.

"అమ్మా! నీకేమన్నా పిచ్చెక్కిందా?" అన్నదో పిల్లచేప,

అమ్మ చేపకు అడ్డంగా నిలబడి.

"నిజంగానే, మనమ్మకు పిచ్చెక్కింది. లేకపోతే ఇలా ఎందుకు చేస్తుంది? మూడు రోజులనుంచీ, ఈ వలను గురించీ ఇందులో దాక్కున్న ప్రమాదాన్ని గురించీ, మనందరకూ చెబుతూనే ఉంది గదా!

"చెప్పి చెప్పి బుర్ర చెడిపోయి ఉంటుంది. అందుకే – తనే – స్వయంగా వలలోకి జొరబడబోతోంది. అందరూ రండి అమ్మను వెనక్కి తీసుకు పోదాం!" అన్నది మరో పిల్లచేప.

"అమ్మా! మమ్మల్ని చెయ్యొద్దన్న పని, నువ్వెందుకు చేస్తున్నావ్?" అన్నది మరీ చిన్నచేప. ఈ చిన్న చేపంటే, అమ్మ చేపకు మరీ ఇష్టం! దాన్నోసారి ఎత్తుకొని ముద్దెట్టుకొంది అమ్మచేప!

"మరేం లేదు కన్నా! మనం మూడు రోజులుగా చూస్తూనే ఉన్నాం గదా! ఆ సుబ్బక్క, ఆమె ఇద్దరు బిడ్డలూ ఆ చింతచెట్టుకింద, అలానే, ఆకలాకలంటూ అలమటిస్తూనే ఉన్నారు గదా!

"చాలామంది వాళ్ళను చూస్తూ కూడా చూడనట్టే, తప్పుకుపోతున్నారు గదా? ఇంతకు ముందు ఆ సుబ్బక్క చెరువులో దిగి, చచ్చి పోవడానికి కూడా సిద్ధపడింది గదా? భగవంతుని దయవల్ల అలా జరగలేదనుకోండి. ఒకవేళ కర్మ గాలిపోయి సుబ్బక్క చనిపోయిందే అనుకోండి? ఆ ఇద్దరు పిల్లలూ దిక్కులేని వారయిపోతారా , పోరా?" అన్నది అమ్మ చేప.

"అయిపోతారు!" అన్నదో కుర్రచేప.

"అలా జరక్కుండా ఉండాలంటే, సుబ్బక్క బతకాలి. బతకాలంటే, ఆమె బిడ్డలకూ ఆమెకూ తిండి దొరకాలి. తిండి

దొరకాలంటే, ఆమె విసిరిన వలకు నేను దొరకాలి. అప్పుడామె బిడ్డలు అనాథలు కారు" అన్నది అమ్మచేప.

అమ్మచేప సమాధానం వింటుంటే, అక్క చేపకు కొంచెం చిరాకేసింది!

"అమ్మా! సుబ్బక్క చనిపోతే, ఆమె బిడ్డలు అనాథలయిపోతారని జాలిపడ్డావు. బాగానే ఉంది. నువ్వు వలలో చిక్కుకొన్నావనుకో. మేము మాత్రం అనాథలమయిపోమా? అప్పుడు మమ్మల్ని మాత్రం ఎవరు చూస్తారే!" అని గొల్లుమని ఏడ్చింది అక్కచేప.

కూతురు అమాయకత్వాన్ని చూసి, జాలిపడ్డది అమ్మచేప! బిడ్డను దగ్గరగా తీసుకొని, తల నిమిరింది. చెంపమీద సుతారంగా ముద్దు పెట్టుకొంది.

"పిచ్చితల్లీ! మనకూ మనుషులకూ చాలా తేడా ఉందమ్మా! పక్క వాళ్ళు మట్టిగొట్టుకు పోతున్నా మనుషులు పట్టించుకోరు. మనం అల్లా కాదు.

మనవి – జాలి గుండెలు. మనమూ బతకాలనుకొంటాం మనచుట్టూ ఉన్నవారు కూడా సుఖంగా బతకాలను కొంటాం. అందుకే ఈశ్వరుడు మనకీ ఉత్తమజన్మ నిచ్చాడు. వాళ్ళనేమో మనుషులుగానే పుట్టించాడు" అన్నదా అమ్మచేప, వలలోకి జొరబడి, తను చిక్కు కొన్నట్టు తెలియడం కోసం, వలను అటూ, ఇటూ కదుపుతూ !

*

# కన్నప్రేమ

ఒకప్పుడు రామాపురం అనే సంస్థానం ఉండేది. కావడానికి అది చిన్నదేగానీ సారవంతమైన భూములు ఉండడం వల్లా, ఆ పొలాలను సాగుచేసి మంచిపంటలు పండించాలన్న ఉత్సాహం గల రైతులు ఉండడం వల్లా, సిరిసంపదలకు లోటు ఉండేది కాదు.

సంస్థానాన్ని పాలించే రామరాజుకి తన సంస్థానమన్నా, సంస్థానంలోని ప్రజలన్నా చాలా ఇష్టం.

"వాళ్ళు సుఖంగా ఉండాలి. అలా ఉన్నప్పుడు, వాళ్ళ సుఖంలోంచి కొంచెం తీసుకొన్నా వాళ్ళేమీ అనుకోరు. ఎవరికి వారికి తామిచ్చింది కొంచెం సుఖమే– అనిపిస్తుంది. అందరి నుంచీ కొంచెం కొంచెం తీసుకొన్న నాకు మాత్రం మరింత సుఖం లభిస్తుంది!" అనేవారు రామరాజుగారు.



"నా సంస్థాన ప్రజలు 'ఈసురో' మంటుంటే నేనూ అలాగే ఉంటాను. వారికే కొరతా ఉండకుండా చూడడం నా బాధ్యత. నాకు తెలియని ఇబ్బందులేమన్నా ఉంటే— వారు నేరుగా నా దగ్గర కొచ్చి చెప్పుకోవచ్చు. వాటిని తీర్చడానికి, నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను. అడగడం వారి వంతు, చేయడం నా వంతు" అంటారు రామరాజుగారు.

జమీందారు గారు మంచివారు కావడం వల్ల నయితేనేం, సంస్థానం సంపన్నమయింది కావడం వల్లనయితేనేం, అక్కడ వ్యాపారం చేయడం లాభసాటిగా ఉంటుందని సోమరాజుకొక ఆలోచన వచ్చింది.

అందుకోసం ఆయనగారు సంస్థానంలోని గ్రామాలన్నీ కాలినడకను తిరిగారు. ఆయా గ్రామాలలోని ప్రజలు ఎలా జీవిస్తున్నదీ పరిశీలించాడు.

వారికి అందుబాటులో ఉన్న వస్తువులేవో, లేనివస్తువులేవో, ఆ లేనివాటిని, ఎక్కణ్ణించి తెచ్చుకొంటున్నారో అసలు అలాంటి వస్తువులేవో లేకుండానే – ఉన్నవాటితోనే సరిపెట్టుకుపోతున్నారో— ఇలాంటివన్నీ నమోదు చేసుకొన్నాడు.

వారి కొనుగోలు శక్తిని అంచనా వేశాడు. ఆ శక్తికి మించిన వస్తువుల్ని అమ్మకాలకు తీసుకురావడం వల్ల, లాభం ఉండకపోగా నష్టపోక తప్పదని సోమరాజుకి తెలుసు.

"రత్నాల హారాలను, వజ్రాల హారాలనూ తెచ్చి, మామూలు వాళ్ళకు అమ్మచూపడం వృథా ప్రయాస. సంపన్నులయిన వారికి తప్ప సామాన్యులకు వాటితో అవసరం ఉండదు. నేను— సామాన్యుడిని. నా వ్యాపారం కూడా సామాన్యులతోనే ఉంటుంది. నాకు లాభాలు ముఖ్యమే గానీ— అంతకన్నా ముఖ్యం— నా ఖాతాదారులు సుఖంగా ఉండడం.

ఈ సంస్థానంలో పుష్కలంగా తయారవుతున్న వాటిని, నేను కొంటాను. మన సంస్థాన ప్రజలకు అవసరమయిన వాటిని నేను అమ్ముతాను." అన్నాడు సోమరాజు దివాన్‌గారితో.

దివాన్ గారు చాలా తెలివయినవారు. ఆవలించకుండానే అవతలివారి పేగులు లెక్క బెట్టడం ఆయనకు తెలుసు.

సోమరాజుగారి మనస్సులో ఏమున్నదీ తెలుసుకోవడానికి, దివాన్‌గారికి ఒక్క క్షణం కూడా పట్టలేదు.

"సోమరాజుగారూ! మీ అభిప్రాయాలు నాకు నచ్చాయి. మీ మాటలు వింటుంటే – మీకు లాభాల మీద బొత్తిగా ఆపేక్ష లేనట్టూ, ప్రజల క్షేమం కోసమే, వ్యాపారం చేయబోతున్నట్టూ మాట్లాడుతున్నారు. ఇక్కడ తయారయిన వాటిని కారు చవగ్గా కొంటారు. ఇక్కడ లేని వస్తువుల్ని ఎక్కువ ధరలకు అమ్ముతారు. ఈ అమ్మే వస్తువుల్ని కూడా అవి తయారయ్యే చోటు నుంచి, కారు చవగ్గానే కొంటారు గదా?

అంటే– మీరు కొనేవి ఎప్పుడూ చౌకగానే ఉంటాయి. మీరు అమ్మేవి ఎప్పుడూ ఖరీదుగానే ఉంటాయి. అమ్మడం ద్వారానూ, కొనడం ద్వారానూ నష్టపోయేది ప్రజలు, లాభపడేది మీరు. అవునా?" అన్నారు దివాన్‌గారు.

దివాన్‌గారి ధోరణికి, సోమరాజు దిమ్మెరపోయాడు. అందులోంచి తేరుకోవడానికి ఆయన కాస్త వ్యవధి తీసుకొన్నాడు.

"దివాన్ గారూ! మీరన్నది అక్షరాలా నిజమేనండీ!! మనం అనుకొంటున్నట్టు – ఈ వ్యాపారంలో లాభాలు రావాలేగానీ– అవన్నీ నా వొక్కడికే కాదండీ! ఈ వ్యాపారం ఈ సంస్థానంలో చేయడానికి జమీందారుగారి అనుమతి కావాలి గదా! ఆ అనుమతి పత్రం నాకు రావడానికి సాయపడేవారికి కూడా ఈ లాభాలలో వాటా ఉంటుంది.

అలాంటి అనుమతి – ఇంకే వ్యాపారికీ ఇవ్వకుండా చూసే మీ వంటి వారికీ ఇందులో వాటా ఉంటుంది ... మీరూ పిల్లా జెల్లాతో ఉన్నవారు. నేనూ– పదిమంది పిల్లలున్న వాణ్ని. నాక్కావలసిన పనులు మీరు చేసి పెట్టండి. మీకు కావలసినవి ఏవో మీరు తీసుకోండి" అన్నాడు సోమరాజు.

సరిగ్గా దివాన్‌గారికి కావలసింది కూడా ఆ మాటే!

"ఈ పద్ధతి ఉభయతారకంగా ఉంది. మనిద్దరం ఈ ఒప్పందానికి కట్టుబడి ఉందాం. అయితే ఈ పనులన్నీ మనం మాట్లాడుకొన్నంత సులభంగా కావు. అవి కావాలంటే–" అని ఆగిపోయారు దివాన్‌గారు.

ఏమేం చేయాలో దివాన్‌గారు చెప్పారు. సోమరాజు ఒప్పాడు.

ఇది జరిగిన రెండు మూడు వారాలకల్లా సోమరాజు ఓ పెద్ద విందును ఏర్పాటు చేశాడు. ఆ విందుకు ముఖ్య అతిథిగా జమీందారుగారిని ఆహ్వానించాడు.

"ఒక సోమరాజు విందు చేయడమేమిటి? ఆ విందుకు నేను హాజరు కావడమేమిటి?" అన్నారు జమీందారు రామరాజుగారు!

"అయ్యా! ఈ సోమరాజు సామాన్యుడు కాడు. ఇది ఆయనగారి యాభయ్యవ పుట్టిన రోజు. ఈ పుట్టిన రోజు సందర్భంగా సోమరాజు గారు చాలా ధర్మ కార్యాలు చేయబోతున్నారు. ఆ ధర్మకార్యాలు మధ్యలో ఆగిపోకుండా కొనసాగడానికి అవసరమయిన ఆర్థిక వనరులను కూడా సమకూర్చబోతున్నారు.

సోమరాజుగారి కుటుంబం ఈ స్థితికి రావడానికి, తమ నాన్నగారు ముఖ్య కారకులు. వారు లేరు గనక వారి పక్షాన తమను ముఖ్య అతిథిగా ఆహ్వానిస్తున్నారు. తమరు అంగీకరించండి!" అని సలహా ఇచ్చారు దివాన్‌గారు.

ఆయన మాటను కాదనడం తెలియని జమీందారుగారు "సరే" నన్నారు.

సోమరాజు జన్మదినోత్సవం వైభవంగా జరిగింది.

'కళారంగానికీ, సాహిత్య రంగానికీ, వారు చేసిన సేవలను గురించి చాలామంది వక్తలు ఉపన్యసించారు.

ముందు ముందు తాను చేయబోతున్న సత్కార్యాలను గురించి ప్రకటించిన సోమరాజునీ , ఈ జన్మ దినోత్సవానికి హాజరయినందుకు జమీందారు రామరాజు గారినీ అందరూ అభినందించారు.

ఉత్సవానికి హాజరయిన వారందికీ భోజనాలు ఏర్పాటు చేశారు. అందరూ పెద్ద పందిరి కిందికి వచ్చారు. జమీందారు గారికో విశాలమయిన గదిలో ఏర్పాటు చేయడం వల్ల – రామరాజుగారు అక్కడికి విచ్చేశారు.

"అయ్యగారికి ఏమేం కావాలో చూసి – జాగ్రత్తగా వడ్డించు" అన్నాడు సోమరాజు.

అనడమే కాదు – జమీందారు గారికి కాస్త ఎడంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు. ఒక్కో పదార్థం పేరు సోమరాజు చెబుతుంటే పనివాడు వడ్డిస్తున్నాడు.

"ప్రభూ! ఆ వెండి గిన్నెలోని కోడి మాంసం! దీన్ని వండడంలో, బంగారు పతకాలను గెలుచుకొన్న వంటవారిని, దూరప్రాంతం నుండి పిలిపించాను. ఇందులో వాడిన మసాలా దినుసులు కూడా మన జమిందారీలో, దొరకవండీ! మీరు దాన్ని తప్పకుండా స్వీకరించాలి!" అన్నాడు సోమరాజు చేతులు జోడించి.

జమీందారు గారు 'సరే' నన్నట్టు తలాడించాడు.

జరగకూడని పని సరిగ్గా అప్పుడు జరిగింది!

ప్రభువు వారి బంగారు పళ్ళెరంలో పడవలసిన మాంసం ముక్క, బల్లమీద పడిపోయింది!

ముఖ్య అతిథిగా వచ్చిన రామరాజు గారు ఆశ్చర్యపోయారు. ఆయనను విందుకు ఆహ్వానించిన సోమరాజు ఆశ్చర్యపోయాడు. అసలీ విందు తతంగాన్నంతా రూపొందించిన దివాన్‌గారు ఆశ్చర్యపోయారు.

వడ్డన పూర్తయిన తరువాత, సోమరాజుగారినుండి బహుమతిని అందుకోందామనుకొన్న పనివాడు – కొయ్యబారి పోయాడు.

"ఈ వెధవను – ఈ వడ్డిస్తున్న వెధవను – చచ్చిందాకా కొరడాలతో బాదండి!" అన్నాడు సోమరాజు కోపంతో మండిపోతూ

అప్పుడు –

ముందుగా వెక్కిళ్ళు వినిపించాయి. తరువాత నన్నవిగొంతు

వినిపించింది!

"నన్ను క్షమించండి!" అన్న మాటలు వినిపించాయి.

ఆమాటలన్న దెవరో తెలీక, అందరూ ఒకరి ముఖాలుఒకరు చూసుకొన్నారు.

"బాబులూ! నన్ను మీరు మన్నించాలి! ఎదురుగా ఉన్న ఆ గోడ వేపు నేనిప్పుడు చూశాను. ఎంతోసేపట్నుంచీ, ఆ గండుపిల్లి ఆ గోడ మీద పొంచి ఉన్నదో నాకు తెలియదు. ఓ నిమిషం కిందట అది నిశ్శబ్దంగా కిందికి దూకింది. దూకాక అటూ ఇటూ చూసింది. అందరూ భోజనాల హడావుడిలో ఉన్నారు. తన నెవరూ గమనించడం లేదని ఆ గండుపిల్లికి తెలుసు.అందరూ ఆవురావురుమంటూ, పొట్టలు నింపుకొంటుంటే, దానికీ తన పొట్ట గుర్తుకొచ్చి ఉంటుంది. అందుకే – నడీ , చప్పుడు లేకుండా ఆ వేపచెట్టు మూలగా వెళ్ళింది. ఒంటితడి కూడా ఆరని నా పదిమంది పిల్లలూ అక్కడే ఉన్నారు.

జమీందారు గారి అనుమతిని సంపాదించడానికి, దొంగ పుట్టినరోజు జరుపుకొంటున్న సోమరాజుగారూ, ఈ పథకాన్నంతా తెలివిగా రూపొందించిన దివాన్‌గారూ, అనుమతించడం ద్వారా, లాభాలలో వాటాలు పంచుకొందామనుకున్న జమీందారుగారూ, తమ బిడ్డలమీధి ప్రేమతోనే గదా ఇదంతా చేస్తున్నది! నేనూ – నా బిడ్డలమీది ప్రేమ తోనే – నా బిడ్డలెవరూ, ఆ గండుపిల్లి పాలబడకూడదన్న అభిప్రాయంతోనే – వారిని కాపాడు కొందామన్న సదుద్దేశంతోనే – ఈ పళ్ళెం లోపించి – ఒక్కడుగు ముందుకేశాను.

వేసిన తరువాతగానీ, నేనేం పొరబాటు పని చేసిందినాకర్థం కాలేదు. ఈ పనివాడు – నన్ను పళ్ళెంలోనే వడ్డించాడు. కిందికి దూకింది నేనే! నా కారణంగా, ఇతన్ని శిక్షించకండి! చనిపోయేదాకా కొరడాలతో మోదవలసిందన్న శిక్షను రద్దు చేయండి. అతని బిడ్డలు అనాధలు కావడం నాకిష్టంలేదు" అన్నదా మాంసంముక్క, తిరిగి పళ్ళెంలోకి వస్తూ. *